The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper
for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండపత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు దక్కన్

**Golconda Patrika. Hyderabad, Dn.**

సంపుటము ౭ } శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ ర జ్యేష్ఠ శు॥ ౧౫ శనివారము 18-6-32 { సంచిక ౧౩

## రౌండు టేబిలు సలహా సంఘ సమావేశము ఎప్పుడు జరుగునో చెప్పజాలను

పార్లమెంటుసభలో హోరుగారి ప్రకటన

లండన్, జూన్ ౧౬:—

“రౌండుటేబిలుసలహాసంఘసభ మేనెల ౨౩వ తేదికి జరుగవలసియుండెను గాని ఆసభను ప్రస్తుతము జరుప వీలులేదని ఆ సంఘమువారు రాజప్రతినిధి కోరించిరి. అది మరల నెపుడు జరుగునో నేనిపుడు చెప్పజాలను గాని అందులకు అనవసరముగ ఆలస్యము కలిగింపబడదని ఇంకను చర్చింపబడదగిన విషయములు చాల కలవు.” అని హోరుగారు తెలిపిరి.

“కాపిటేషను ఛార్జిను యుంచుచూ దేశరక్షణవ్యయమును గూర్చి ఆలోచించుట కొరకు అడ్హాక్ ట్రిబ్యునలు నేర్పరచునట్లు నిర్ణయింపబడెను. ఆ ట్రిబ్యునలు సభ్యుల పేర్లు మున్నగువాటిని నేనిటుపైని తెలుపగలుగుదునని తలచెదను. అని హోరుగారు నుడివిరి. దీనినిగూర్చి థామసు విలియమ్సుగారు ప్రశ్నించిరి.

### మహమ్మదీయులగు కసాయివారు జంతువులను చంపుట

సైన్యములకు మాంసమును సప్లయిచేయునట్టి మహమ్మదీయ కసాయీలు యంత్రసహాయమున వాటిని చంపుటలేదు. ఇంకను గొంతుకలుకోసియే చంపుచున్నారు. దీనినిగూర్చి ఇండియాదొరతనమువారు బాగుగా నాలోచించిరి. దీనిని నిరోధించినచో మహమ్మదీయుల మతధర్మములకు భంగము కలిగించుట తటస్థించును. జంతువులను చంపువారిలో హెచ్చుమంది మహమ్మదీయులే. వారు సేనలలోని బ్రిటిష్ సైనికులను మహమ్మదీయ సైనికులను మాంసమును సప్లయిచేయుటకే జంతువులను చంపుచుందురు అని లెఫ్టనెంటుకల్నలు మూరుగారికి హోరుగారు ప్రత్యుత్తరమిచ్చిరి.

### డాక్టరు మూంజీగారు ఇంగ్లాండుకు బోయిరి

కొన్ని నెలలుందురు

బొంబాయి, జూన్ ౧౩:—

డా॥ మూంజీగారు భారతవర్తక సంఘాధ్యక్షులగు వాలుచంద హీరాచందుగారును నేడు మధ్యాహ్నము లండనునకు పయనమయిరి. వాల్చందుగారు వ్యాపారనిమిత్తము పోవుచున్నారు. ఆరువారములలో తిరిగి రాగలరు. డా॥ మూంజీగారు ఇంగ్లాండులో కొన్ని నెలలుండు నుద్దేశముతో బోవుచున్నారు.

### డి వెలెరాగారిజనని

దివంగతురాలగుట

న్యూయార్కు, జూన్ ౧౭:—

డివెలెరాగారి జనని చనిపోయెను. (రూటరు)

### ఐరిషు ఫ్రీస్టేటు ఎన్నికలు

డబ్లిన్, జూన్ ౧౭:—

ఐరిషు ఫ్రీస్టేటు ఎన్నికలను అకస్మికముగ జరుపుట కాలోచించుచుండెనను పంచలనము బయలుదేరెను. జూలై మొదటివారములో డెయిలు పార్లమెంటును డివెలరాగారు రద్దుచేయునటుల యోచించుచున్నారు. కాని ఇది సజమనుటకు అధికారవర్గపు సూచనలుగాని చిహ్నములుగాని కన్పించవు.

# H. E. H. THE NIZAM'S STATE RAILWAY.
## మహా ఘనత వహించిన నిజాం స్టేటు రైల్వే

బ్రాడుగేజి, మీటరుగేజి బండ్ల కాల నిర్ణయము 1–7–1932 నుండి అమలులో నుండును

| బ్రాడ్ గేజి | | | | | |
|---|---|---|---|---|---|
| | 2 | | | 4 | |
| | ప్యాసింజరు | | | ప్యాసింజరు | 10 |
| వాడి | బ॥ 1-55 | | | 11-45 | |
| ఉద్గిర్ | బ॥ | | | | 9- 0 |
| మహమ్మదా | చె॥ | | | | 13- 5 |
| బీదరు [బాదు | బ॥ | | | | 13-35 |
| | చె॥ 5- 5 | | | 14-33 | 17- 5 |
| | | 7 | | | ప్యాసింజరు |
| వికారాబాదు | బ॥ 5-13 | | | 14-33 | 17-42 |
| హైద్రాబాదు | చె॥ 7- 6 | | 2 | 16-32 | 19-48 |
| బి.జి. | బ॥ 7-41 | | ప్యాసింజరు | 17-00 | 20- 0 |
| సికింద్రాబాదు | చె॥ 7-58 | | హైద్రాబా | 17-17 | 20-17 |
| [నేరుగా బల్లార్షకు] | | | [illegible]జవాడ(నేరుగా డిల్లీకి) | | నిలచిపో |
| హైద్రాబాదు బి.జి. | బ॥ 8- 0 | | 13-26 | 12 | వును |
| సికింద్రాబాదు | చె॥ | 6 | 1? ?2 | ప్యాసింజరు | |
| | బ॥ 8-28 | జి. టి | 1? ?3 | 18-10 | |
| కాజీపేట ... | చె॥12-45 | ఎక్స్‌ప్రెస్ | 1? ? | 21- 1 | |
| | బ॥ 13- 5 | బలహార్ష | | | |
| బలహార్షా ... | చె॥19-45 | నుండి | | | |
| | బ॥నిలచును | 1-25 | | | |
| కాజీపేట ... | చె॥ 14- | 6-55 | | | |
| | బ॥యఫ్.మిక్స్డు | 7-15 | 17-27 | 21-40 | |
| డోర్నకల్లు... | చె॥ | 9- 3 | 19-34 | 23-59 | |
| | బ॥ 7- 3 | 9-15 | 19-51 | నిలచిపోవును | |
| బెజవాడ ... | చె॥10-20 | 11-20 | 22-30 | | |
| | | మద్రాసుకు | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | 11 | 1 | 5 జి. టి. | 13 యఫ్. |
| | | ప్యాసింజరు | ప్యాసింజరు | యక్స్‌ప్రెస్ | మిక్సుడ్ |
| | | | | మద్రాసునుండి | |
| బెజవాడ .. | బ॥ | | 4-50 | 16-35 | 18-20 |
| డోర్నకల్లు | చె॥ | బయలుదేరుట | 7-34 | 19-00 | 21-45 |
| | బ॥ | 3-45 | 7-46 | 19-12 | నిలచిపోవు |
| కాజీపేట ... | చె॥ | 6-20 | 10-7 | 21- 6 | |
| | | | | 21-35 | |
| బలహార్షా ... | చె॥ | | | 3- 0 | 7 |
| | బ॥ | | | డిల్లీకి | 9- 0 |
| కాజీపేట ... | చె॥ | | | | 15-49 |
| | బ॥ | 7- 8 | 10-17 | | 16- 5 |
| సికింద్రాబాదు | చె॥ | 10-15 | 13-50 | | 20-35 |
| | బ॥ | 10-35 | 14- 5 | | 21- 3 |
| హైద్రాబాదు బి.జి. | చె॥ | 10-52 | 14-22 | | 21-20 |
| 2 ప్యాసింజరు | | నిలచిపోవును | 14-45 | 9 | నిలచిపోవును |
| సికిందాబాదు | చె॥ | | 15-15 | | |
| | బ॥ 9-25 | | 16-34 | 7- 2 | |
| హైద్రాబాదు | చె॥ 9-42 | | 16-51 | 7-19 | |
| బి. జి. | బ॥ 9-55 | | 17-14 | 7-28 | |
| వికారాబాదు | చె॥11-55 | | 19- 9 | 9-28 | |
| | బ॥12-20 | | 19-19 | 9-50 | |
| మహమదాబాదు | చె॥ | | | 12-45 | |
| బీదరు ... | బ॥ | | | 13-10 | |
| ఉద్గిర్ ... | చె॥ | | | 17- 5 | |
| వాడి ... | చె॥15-15 | | 22-00నిలచిపోవు | | |

| (బ్రాంచిలైన్లు) | | 16 | 18 |
|---|---|---|---|
| డోర్నకల్లు | బ॥ | 1- 0 | 19-55 |
| సింగరేని కాలరీస్ | చె॥ | 2-25 | 21-20 |

| సింగరేని | | 15 | 17 |
|---|---|---|---|
| కాలరీస్ ... | బ॥ | 5-10 | 22-20 |
| డోర్నకల్లు... | చె॥ | 6-30 | 23.40 |

| | | 20 |
|---|---|---|
| డోర్నకల్లు | బ॥ | 9-20 |
| భద్రాచలం | చె॥ | 11-35 |

| | | 19 |
|---|---|---|
| భద్రాచలం రోడ్డు | బ॥ | 15-00 |
| డోర్నకల్లు ... | చె॥ | 17-10 |

| మీటరు గేజి | 35 | 41 | 39 |
|---|---|---|---|
| ద్రోణాచలం | బ॥ 10-20 | 3-30 | 15-10 |
| | చె॥ 11-47 | 6-30 | 17-10 |
| కర్నూల్ టౌన్ | బ॥ 11-59 | నిలచిపో | నిలచిపోవు |
| మహబూబు | చె॥ 16-20 | వును | 37 |
| నగర్ | బ॥ 16-36 | 54 | 7-30 |
| | చె॥ 20- 5 | | 10-49 |
| హైద్రాబాదు యం.జి. | బ॥ 20-28 | 7-50 | 10-52 |
| సికింద్రాబాదు | చె॥20-50 | 8-15 | 11-10 |
| | 32 | | నిలచి పోవు |
| | బ॥ 21-50 | 8-50 | |
| | చె॥ 2-48 | 14-38 | |
| నిజామాబాదు | బ॥ 3- 4 | 15- 8 | 50 S.S C. |
| నాందేడు ... | బ॥ 6-22 | 19- 5 | 14-59 |
| పూర్ణ ... | చె॥ 7-12 | 20- 5 | 16-00 |
| | | 34 | H.N.L కు |
| | బ॥ 7-32 | 16-20 | 16-30 |
| పరభని ... | చె॥ 8-19 | 17- 3 | |
| | బ॥ 8-33 | 17-10 | |
| జాల్నా ... | చె॥12- 2 | 20-20 | |
| | బ॥12-27 | 20-45 | |
| మన్మాడు ... | చె॥17-50 | 2-35 | |

| | 31 | 33 | | |
|---|---|---|---|---|
| మన్మాడు... | బ॥ 12-20 | 3-45 | | |
| జాల్నా ... | చె॥ 16-47 | 9-30 | | |
| | బ॥ 16-59 | 9-56 | | |
| పరభని ... | చె॥ 19-53 | 12-42 | | |
| | బ॥ 19-57 | 12-50 | | 49 S.S.C. |
| | చె॥ 20 38 | 13-30 | | |
| పూర్ణ ... | | 53 | | |
| | బ॥ 20-53 | 7-35 | | 13-45 |
| నాందేడు ... | చె॥ 21-39 | 8-30 | | 14-46 |
| నిజామాబాదు | చె॥ 0-50 | 12-28 | | నిలచిపోవును |
| | బ॥ 1- 4 | 12-58 | 38 | |
| | చె॥ 6- 3 | 19-20 | | |
| సికింద్రాబాదు | 36 | | | |
| | బ॥ 6-33 | 19-45 | 17-37 | |
| హైద్రాబాదు బి.జి. | చె॥ 6-41 | 20- 5 | 17-45 | |
| | బ॥ 6-56 | నిలచిపోవు | 17-50 | |
| మహబూబునగరం | చె॥ 9-39 | | 20-40 | |
| | బ॥ 9-47 | | నిలచిపోవు | |
| కర్నూల్ టౌను | చె॥ 13-19 | 42 | 40 | |
| | బ॥ 13-31 | 18-10 | 7-50 | |
| ద్రోణాచలం | చె॥ 14 45 | 21-10 | 9-50 | |

| బ్రాంచిలైనులు | 43 | 51 S.S.C. | |
|---|---|---|---|
| | | నాందేడు నుండి | |
| పూర్ణ ... | బ॥ 7-40 | 16-30 | హింగోలి |
| హింగోలి... | చె॥ 11-22 | 19-30 | పూర్ణ |

| 44 | 52 S,S.C. |
|---|---|
| బ॥ 12-20 | 4-00 |
| చె॥ 15-50 | 7-00 |

| P.P. రైల్వే | 46 | 45 |
|---|---|---|
| పరభని | బ॥ 9-00 పుర్లి | బ॥ 13-30 |
| పుర్లి | చె॥ 12-30 పరభని | చె॥ 16-40 |

చీఫ్ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు ఆఫీసు
N. S. రైల్వే సికింద్రాబాదు 6 జూన్ 1931

(అనుమతిని)

డి. బి. శ్రేవరు చీఫ్ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు &
చీఫ్ కమ్మర్షియల్ మ్యానేజరు.

## పంజాబు రాజకీయ సభాధ్యక్షునికి 18 నెలలు

లాహోరు, జూను 13:—

లాహోరు మునిసిపాలిటీ సరిహద్దులను విడిచి పోరాదని జిల్లా మేజిస్ట్రేటు చేసిన ఉత్తరువుల నుల్లంఘించి పంజాబు రాష్ట్రీయ సభాధ్యక్షత వహించుటకు వెడలిన శ్రీయుత ఆచార్య గాను దేవుగారు ఎమర్జెన్సీ పవర్సు ఆక్టినెన్సుక్రింద 18 నెలలు కఠినశిక్ష, 100 రూపాయలు జరిమానా లేక 3 నెలలు అధికశిక్ష విధింపబడిరి.

హార్డికర్ గారి అరెస్టు

బుల్లటీనులను అమ్మెనని పోలీసులు తెచ్చిన కేసులో తగినంతసాక్ష్యము లేనందున విడుదల చేయబడిన హార్డికర్ గారును మరియిద్దరును నేడు మధ్యాహ్నము ఎమర్జెన్సీ ఆక్టినెన్సుక్రింద తిరిగి అరెస్టు చేయబడిరి.

---

చెరసాలలో రాజకీయ ఖైదీ మరణము

మూల్టాన్, జూన్ 8:—

కర్నాల్ తహసీలు గిర్దావాస్తవ్యుడగు మిల్ ఖాన్‌సింగు చెరసాలలో పెట్టబడి నప్పటినుండి జబ్బుగానుండెను. ఆయన మూల్టాన్ ప్రాంత సెంట్రల్ జెయిలులో జూన్ 6 తారీఖు రాత్రి మరణించెను. ఆయన దహనసంస్కారము జూన్ 7 న తారీఖున యితరఖైదీలచే చెరసాల వెలుపల జరుపబడెను. మరణవార్త కాంగ్రెస్ కార్యాలయము వద్ద తెలియగానే కొందరు కాంగ్రెస్ వాదులును శాంతిసైనికులును దహనసంస్కారములలో పాల్గొనుటకు బోయిరి. కాని అధికారులు వారిని రానివ్వలేదు. మిల్ ఖాన్‌సింగుగారు దినక్రమేణ క్షీణించుచున్న విషయమును అధికారులు ఆయన బంధువులకుగూడ తెలియజేయలేదని నిన్న విడుదలచేయబడిన కితాలి, కార్నల్ ఖైదీలు కొందరు చెప్పుచున్నారు.

ఆంగ్లో ఐరిషు రాయబారము

---

డీవెలరాగారి ప్రకటనము

డబ్లిన్, జూన్ 14:—

నేడు డెయిలు పార్లమెంటులో డీవెలరాగారు ఆంగ్లో ఐరిషు రాయబారములనుగూర్చి ముఖ్య ప్రకటనమును గావించుటకు.

దంపుడుబియ్యమును ఆహారముగా నుపయోగించు విధము

---

శ్రీయుత ఆర్. వి లక్ష్మీరతను (సీనియరు) గారిట్లు వ్రాయుచున్నారు.

మనకు అన్నిటికంటె ముఖ్య ఆహారపదార్థమైనట్టి దంపుడుబియ్యమును మనము నిజముగా ఆరోగ్యకరమగు ఆహారముగా నుపయోగించుచున్నామా యనుప్రశ్నను నేనువిచారించుచున్నాను. ఈక్రింది విషయములగూర్చి అనుభవజ్ఞుల యభిప్రాయమును ముఖ్యముగా వైద్యులయభిప్రాయమును, యీపత్రికమూలమున తెలుసుకొనగోరుచున్నాను.

1. ఆహారము జీర్ణమగుటకు ఫలితములు, నోటిలో ఉమ్మినీరు కలుపుట యుపయోగము.

2. ఆహారము ఉమ్మినీరుతో బాగుగా కలయునట్లు నమలుట యవసరము.

3. బియ్యమును నీటితోకడగి యుడుకబెట్టి గంజివార్చినపిదప, పులుసు, చారు, మజ్జిగలతో కలిపి తినుటవలన, బాగుగ నమలబడి, ఉమ్మినీరుతో కలియును.

4. వరియన్నముగాని, లేక పిండిగాని, బాగుగా నమలబడి, ఉమ్మినీరుతో కలియుటకు యేవిధముగా తయారుచేయబడవలెను?

5. బియ్యములో నుండునట్టి లవణపదార్థములు, విటమినులు, మాంసకృత్తులు మున్నగునవన్నియును మిల్లు బియ్యములో నుండునా?

6. ఈ పదార్థములు పోకుండ ధాన్యమును దంచి, బియ్యమును తయారుచేయుటమంచిసాధనమేదయిన నున్నదా?

7. ఇట్లు తయారు చేయబడిన బియ్యమునుండి మనము సాధ్యమగునంత సత్తువ సంపాదించుటకు యేవిధముగా నుపయోగింపవలెను?

---

తల్లి, కూతురు, తల్లితల్లి వధింపబడుట

---

లండన్, జూన్ 14:—

ఎవరో ఒక సైనికుడు జ్యానిస్విష్టు అనునామెను ఆమె కూతురిని మనుమరాలిని తుపాకితో కాల్చి చంపెను. పోలీసువారు వేటకుక్కలతో విచారించుచు వెనుకగా వెంటుటలో అప్పట్టు అటవిలోకలు నొకరు వీరిని చంపిన సైనికుని తీవ్రముగ నతని తుపాకిగుండ్లతో నెత్తి పట్టుకొనిరి. అనంతరము కూడ పోలీసువారిని చేతుపాకితో పోరాడెను. కాని లోబడవలసివచ్చెను.

దేశమునందంతటను వడగాడ్పులు

మెండుగా నుండుట

---

ఢిల్లీలో ఒక్కరోజున 122 మంది చనిపోవుట

జూను 1-వ తేదీనుండి 628 మంది చనిపోయిరి

ఢిల్లీ, జూను 14:—

నిన్న 11 గంటలు మొదలు నేడు 11 గంటల వరకు అనగా 24 గంటలలో యిచట 122 మంది వడగాడ్పులవలన మృతినొందిరి. వీరిలో 74 గురు బిడ్డలు 48మంది పెద్దవారునుకలరు. ఈ నెలమొదటి తేదీ మొదలు యింతవరకు 628 మంది చనిపోయిరి వీరిలో పిల్లలు 400 మంది పెద్దవారు 228 మంది నేడు కలకత్తాలో కూడ గాడ్పులు మిక్కిలి హెచ్చుగా నుండెను.

లక్నోలోగూడ రోజుకురోజు గాడ్పులు ప్రబలుచున్నవి. చాలమందికి వడదెబ్బలు తగిలినవి. 16 మంది చనిపోయి రని తెలిసినది.

---

## భారతదేశీయ సైనికవ్యయము

పార్లమెంటుసభలో హోరుగారి ప్రకటనము

భారతదేశమునకు పంపబడు సైనికులయొక్కయు, సైనికోద్యోగీయులయొక్కయు, ఖర్చుల విషయమునను ఒక సలహా పంచాయితీ సంఘమేర్పరుపబడునని భారత కార్యదర్శి పార్లమెంటులో నొక ప్రకటనము గావించెను. (నిన్నటి వార్త చూడదగును) ఈప్రకటన చేయబడిన తరువాత యిచ్చట పలువురు ప్రాతినిధ్యాలో తిరిగి కొంతశ్రద్ధవహించుచున్నారు. భారతదేశమునకును, ఆంగ్లదేశమునకును వచ్చిన రెండు తగాదాలలో నొకటి రాలిన్సన్ ప్రభువుగారును, సర్ బి. యన్. మిత్రాగారును ఆంగ్లదేశమునకు ప్రత్యేక రాయబారులుగా వెళ్ళినప్పుడు పరిష్కారమయ్యెను. కాని రెండవదియగు క్యాపిటేషను ఛార్జీల విషయము పరిష్కారము కాలేదు. క్యాపిటేషను ఛార్జీలనగా భారతదేశములో పనిచేయుటకువచ్చు బ్రిటిష్ ఉద్యోగీయులను, సైనికులను తర్ఫీదుచేయుటకు ఆంగ్లప్రభుత్వమువారు భారతదేశమునుండి వసూలుచేయు ద్రవ్యము. ఈ డబ్బును బ్రిటిష్ ప్రభుత్వమువారు వసూలుచేయ మొదలుపెట్టిన కాలమునుండి యివి అన్యాయములని, అధర్మములని భారతప్రభుత్వమువారు చెప్పుచుండిరి. సామ్రాజ్య రక్షణమునకై బ్రిటిష్ సైనికులు వినియోగపడుచున్నంతకాలము ఈ ఖర్చులను భారతదేశమునుండి వసూలుచేయుట అన్యాయమని భారతప్రభుత్వమువారు చెప్పుచుండిరి. మార్లేప్రభువుకాలములో భారతప్రభుత్వము బ్రిటిష్ ప్రభుత్వమువారికి 14 లక్షల పౌనుల నివ్వనంగీకరించుటచే ఈతగాదా తాత్కాలికముగా పరిష్కారమయ్యెను. యుద్ధానంతరము, సైనికశిక్షకై ఖర్చులు పెరిగినందున భారతదేశమిచ్చుడబ్బునుకూడ హెచ్చు చేయవలెనని బ్రిటిష్ ప్రభుత్వమువారు కోరిరి. ఈ ఖర్చులను పూర్తిగా రద్దుచేయవలెనని భారత ప్రభుత్వమువారు కోరిరి. కావున పూర్వపుమాదిరిగానే క్యాపిటేషను ఛార్జీలు యివ్వబడుచుండెను. ఈఛార్జీలను విధించుటకు భారతప్రభుత్వమువారు అసమ్మతి దెలుపుచు, స్వతంత్ర పంచాయితీ సంఘము నొకటి యీవిషయమును పరిష్కారము చేయవలెనని కోరుచుండెను. భారతకార్యదర్శి యేర్పరుపదలంచిన సంఘస్వరూప మేదియో యింకను తెలియలేదు. కాని న్యాయ విచారణయందు జ్ఞానమును అనుభవమును కలవారలు నియమింపబడుదురనియు, భారతదేశ ప్రతినిధులు తగినంత మందియుందురనియు ఊహింపబడుచున్నది. ఈమూడు సంవత్సరములనుండి భారతదేశ రాజ్యాంగవిధానమును యేర్పరుచుటకు జరుగుచున్న ప్రయత్నములవలన భారతదేశముయొక్క హక్కు దృఢపడినదిగాని, యేమాత్రమును బలహీనములేదనుట నిస్సంశయము:

---

భోజనములో విషము

---

ఒక కుటుంబమంతయు బాధకు లోనగుట

మదరాసు జూను 14:—

సైనా బజారులో బైరాగి మఠమందు నివసించుచున్న 7 గురు గల ఒక కుటుంబమువారు తాము భుజించిన అన్నము విషముగా పరిణమించుటచే విషబాధతో నిన్నసాయంకాలము జనరలు ఆసుపత్రిలో చేర్చబడిరి. వీరు అన్నమును భుజించగానే మయికము కలిగి కొంత సేపయిన తరువాత వాంతులు చేయప్రారంభించిరి. ఈకుటుంబమునకు చెందిన ఇద్దరు పిల్లలుమాత్రము అపాయస్థితియందున్నారు. పోలీసువారు విచారణ సలుపుచున్నారు.

---

బ్యాంకులో దొంగతనము

---

ఇంపీరియలు బ్యాంకునకు 2;60,000 నష్టము

మిల్టాను, జూను 14:—

ఇచట ఇంపీరియలు బ్యాంకు కార్యాలయమునందు 2, 60,000 అపహరించబడెను. బ్యాంకు ఉద్యోగులలో నెవరో ఇనుపపెట్టెతీసి అపహరించియుందురని అనుమానము. ఏజెంటు లెక్కల పుస్తకములన్నియు శ్రద్ధగజూచెను. తప్పుగుపడలేదు.

---

## బొంబయిలో ఇంకను కొట్లాట జరుగుచునేయున్నది

పోయిన గురువారమును శుక్రవారమును కొంత యలజడి తగ్గెనని తెలిసి చాలమంది సంతోషించిరి. కాని యీసంక్షోభ మింతటితో తీరలేదని తెలియుచున్నది.

శనివారమునాడు దుండగులు కొన్ని మెడల బాటను పోవుచుండు వారిపైబడి కత్తులతో పొడుచుట జరిగినది.

ఇద్దరు హిందువులును ఇద్దరు మహమ్మదీయులును కత్తిపోట్లతో హాస్పిటలులో చేరిరి. వారిలో నొక మహమ్మదీయుడు దెబ్బలవలన మరణించెను.

12 వ తేదీ ఉదయము 6 గురికి గాయములు

కత్తిపోట్లతో నున్నవారు 6 గురు 12 వ తేదీ ఉదయము హాస్పిటలులో చేరిరి.

12 వ తేదీ సాయంకాలము కాంగ్రెసు హాస్పిటలులో కత్తిపోట్లకు చికిత్స నందుచున్న యొక హిందువు మరణించెను.

177 చావులు 1975 గాయములు

దీనితో చచ్చినవారిసంఖ్య 177 ను గాయములు తినినవారిసంఖ్య 1975 అయ్యెను.

గూండాల నింకను అరెస్టు చేయుచునేయున్నారు.

## మౌలానాషౌకతాలీగారి స్టేటుమెంటు

బొంబయిలో జరిగిన సంక్షోభ సందర్భమున మౌలానాషౌకతాలీగారొక స్టేటుమెంటునుచేసి వార్తాపత్రికలకు పంపించిరి.

వార్తాపత్రికల తగవులాట యనిన నాకిష్టములేదు. వ్యసనధియు చాలదు.

దురదృష్టవశమున ప్రజలు బాధనందుచున్నారు. దురంతము లింకను సాగుచునేయున్నవి. ప్రతిదినమును కొంత యలజడి కలుగుచునేయున్నది. హిందూ వార్తాపత్రికలు నన్నుగురించి యసత్యవిషయములను ప్రకటించు నలవాటుగలవి. ఇవి యిప్పుడు నామీదను ఖిలాఫత్ కమిటీమీదను తమ యాగ్రహమునంతటిని గ్రక్కుచున్నవి.

లాలా జపతిరాయిగారి మరణమునకు సానుభూతి తెలుపుటకు 1928 నిచట క్రాస్ జహాంగీరు హాలులో జరిగిన బహిరంగిసభకు నన్ను నాహ్వానించిరి. అందువలన ఖిలాఫతు కార్యదర్శిగా నేనా సభకు వెళ్లితిని. కాన్పూరు సభకు నేనధ్యక్షత వహించినప్పుడు మహమ్మదీయులు దేశమున కధికమగుసేవ చేసిరని నేను నుడివియుంటిని అందునకు బొంబాయి సభకు నేను వెళ్లగా అందరును నన్ను అవమానపరుచుచు యీలలువేసిరి. కావున యిట్టిమిశ్రమసభలకు వెళ్లకుండుటకే నేను నిశ్చయించితిని. రాజకీయవిభాగమున హిందువులతో నేకీభవింపజాలనివానికి మెచటను గూడ న్యాయము జరుగదు.

మే నెల 12 వ తేదిని హాలోజలు మొజష్టికులో యిండియా వెల్ఫేరులీగ్ సభ్యులకు విందుజరిగినది. ఆసభలో మాటలాడవలెనని గౌరవకార్యదర్శి నన్ను చాల నిర్బంధించెను. మేనెల 14 వ తేదిని అల్లరులు ప్రారంభమైనవి. ఆసభలో సర్వమత సామరస్యము న్యాయమునుగూర్చి నేను చావరికను లేకుండ మాటలాడితిని. అన్ని మతములవారికిని సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెను. ఎట్టి నిర్బంధము నుండగూడదు'' అని నేను నుడివితిని ఇట్టికాంగ్రెసువారికి అంధ్రప్రాయముగా కాంగ్రెసుననుసరించు ప్రజలకును గూడ పరిపడలేదు.

మొహరములో మహమ్మదీయులు ప్రార్థనలు సలుపుటకు దేశమున శాంతినెలకొనుట ముఖ్యావసరము. మేనెల 14 వ తేదిని సర్దారు సులేమాను కాసిం మిఠాగారికి స్వాగతమొసగుటకు వేలకొలది మహమ్మదీయులును నాయకులును వలంటీరులును భాయ్‌కులా మొహల్లా రేవుకంతవద్ద చేరియుండిరి. అపుడు ఏదో అల్పకారణమును ఆధారముచేసుకొని ఆ ప్రాంతములోని హిందువులు అచటచేరిన మహమ్మదీయులపైని సోడాసీసాలను రాళ్లను విసరిరి. పిమ్మట పోలీసువారు వెతుకగా ఒక హిందువుయింటిలో చాల సోడాసీసాలు దొరికినవి. పిమ్మట మహమ్మదీయులు శాంతముగా మిఠాగారిని ఊరేగింపుతో తీసికొని వెళ్లుచుండగా హిందువులు రాళ్లను నిందాకరములగు కరపత్రములను తమ యిండ్లలోనుండి విసరిరి. తరువాత జరిగినవిషయము లందరికిని తెలిసినవే యున్నవి నాకు పూర్వానుభవము పూర్తిగానుండినను ఓరియంటు క్లబ్బులో జరుగు హిందూనాయకులసభకు రావలెనని ఒక ప్రముఖుడు హిందూవర్తకుడు నన్నును మరి 15 మంది మహమ్మదీయులను ఆహ్వానింపగా మే మంగీకరించితిమి. ఆ సభకు అతడును మరియిద్దరు హిందూప్రముఖులును మాత్రమే వచ్చిరి. అందువలన సభ జరుగలేదు.

అటుపిమ్మట పురమందిరమున జరిగినసభకు మేయరుగారు నన్ను పిలువగనే నాసభలోగూడ పాల్గొంటిని. ఆ సభలో నొక పత్రిక ధోరణిని నిరసించుచు ఒక హిందూనాయకుడు మాటలాడ X మరియొక పత్రికధోరణినిగూర్చి నేనుగూడ తెలిపితిని.

2 వ తేదిని పురమందిరమున జరిగినసభకు రావలెనని మేనెల 19 వ తేదినే సర్దారు సులేమాను కాసిం మొహమ్మదాలీగారు నన్ను పిలచినందున నేనా సభకు కొంచెము ఆలస్యముగా వెళ్లితిని. నేనచటికి వెళ్లకపూర్వమే ఖిలాఫతు సంఘమును ఖిలాఫతు వలంటీరులను వారి నియంతనగు నన్నును నిరసించుచు ఒక హిందూనాయకుడు ఆసభలో చాల కోపముగా మాటలాడెను. ఒక పత్రికలో ప్రకటింపబడిన అసత్యవార్త నతడాసభలో వెల్లడించుచు ఖిలాఫతు వలంటీరుదళము నేర్పాటుచేసినవాడని అనగా నన్ను దేశమునుండి వెడలగొట్టవలెనని తెలిపెను. అల్లరులకు నేనే కారకుడనని మరియొక హిందూనాయకుడుగూడ ననెను నేను సభకు వెళ్లునప్పటికి సభ వారంతయును విరసముగా నేర్పడెను

''ఖిలాఫతు వారికి అంబ్యులెన్సు కారుగాని వ్యానుగాని లేదు. ఖిలాఫతుసంఘమువారి కారులో రక్తపుడాగులుగల కత్తులేవియును కనబడలేదు. అట్టి కారులో ఖిలాఫతు వలంటీరులను అరెస్టుచేసియుండలేదు. ఈవార్తలన్నియును కల్పితములు మాకు అపకారము చేయగోరువారు వీనిని కల్పించిరి ఈవార్తను ప్రకటించిన పత్రిక యిదివరకుగూడ నట్టివార్తలనే ప్రకటించియుండెను.

ఈఅల్లరు లన్నిటికిని నేను సులేమాను మిఠాగారలు కారకులమని ఆపత్రిక వ్రాసెను అని నేను ఆసభలో చెప్పితిని నేనింకను మాటలాడుచుండగా హిందువులు అల్లరిచేసిరి అధ్యక్షుడు నా ఉపన్యాసమును సాగనియ్యలేదు హిందూసభ్యు లందరును కేకలువేయసాగిరి నేను లేనపుడు వారునన్ను నిందించిరి ఆనిందలకు నేను ప్రత్యుత్తరముల నీయబోవగా వారు వినకుండ అల్లరిచేసిరి కావున నిట్టిసభతో సంబంధమును వదలుకొనుటయే మంచిదని నేను తలచితిని. నేను అగదినివదలి వచ్చుచుండగా హిందువులందరును కేకలువేయసాగిరి అందువలన నాకాగ్రహముకలిగి ''ఇట్టి పాడుసంఘము డాక్టర్ కమిటీనుయందును వీని చర్యలయందును నాకు నమ్మకములేదు'' అని నుడువుచు వెడలిపోతిని.

నేను అననిమాట లన్నిటిని నేనంటినని కల్పించి దేశమునందంతటను హిందువుల పత్రికలన్నిటిలోనుగూడ ప్రకటించిరి ఇతరదేశముల పత్రికలలోగూడ ప్రకటింపబడెను.

ఈ అల్లరులనుగూర్చి దొరతనమువారు విచారణచేసినను మానిన నేను మహమ్మదీయుల ఖ్యాతిని నిలుపుటకు ఆపత్రికపైని న్యాయస్థానమున చర్య జరుపుటకు నిశ్చయించితిని నిజము తెల్లమయగుటకును యిట్టి అపనిందలను చేయువారికి గుణపాఠమును బోధించుటకు నేనిటుల చేయ దలచితిని. మేము వోరిమితోను సద్భావముతోను మౌనము వహించుటచే వారి ధోరణి మితిమీరుచున్నది నేనపుడే కాగితములను న్యాయవాదులకు వశపరచితిని.

దొరతనమువారు నాకు ధనమిచ్చుచున్నారని యు దానికొనపడి నేను వారికి లొంగిపోతిననియు బహిరంగముగానే అందరును తెల్పుచున్నారు.

నాతమ్ముడగు మౌలానా మహమ్మదాలీ మొదటి రౌండుటేబిలుసభలో పాల్గొనుటకు సమ్మతించినను కారణమున అతడు యింగ్లాండుకు బయలుదేరినరోజున కాంగ్రెసువారు నల్ల జండాలతో నెదుర్కొనగోరిరి. అపుడు నాతమ్మునికి చాల జబ్బుగానుండెను. కాంగ్రెసునాయకులకు వివేకమును కలిగించుటకు చేయబడిన ప్రయత్నము లన్నియును విఫలమైనవి. ఎస్ప్లనేడు మైదానమున కాంగ్రెసువారు బహిరంగసభను చేయదలచిరి. అప్పుడా సభను మహమ్మదీయులు వశపరుచుకొనిరి ఆసభలో నాతమ్మునియందు విశ్వాసము కలదను తీర్మానము ఆమోదింపబడెను, 25000 మంది మహమ్మదీయులు అనుకూలముగా వోటుచేసిరి 100 మంది హిందువులు మాత్రమే ప్రతికూలురుగా నుండిరి. అంతటిలో కాంగ్రెసువారు ప్రతికూలప్రచారము మానివేసిరి. పిమ్మట మోలులో పెక్కువేలమంది నమాజేశమై మమ్ములను వీడ్కొల్పిరి. నా సోదరుడు ప్రాణములను వదలువరకును తన మతమునకును దేశమునకును సేవచేయుచునేయుండెను. ఇపుడు నేను నామతమువారి న్యాయమైన హక్కులకొరకు పనిచేయుచున్నానని నన్ను నిరసించుచున్నారు. నేనెంతమాత్రమును లొంగను నాజాతివారు కాంగ్రెసువారి అనుగ్రహముపై నాధారపడుటకు నేనెన్నటికిని సమ్మతింపను.

''మహమ్మదాలీగారు చనిపోయినప్పటినుండియు ఇండియాదొరతనమువారు స్వరాజముగాగాని రాష్ట్రీయ దొరతనములద్వారాగాని షౌకతాలీగారికే యేమైన ధనమునిచ్చిరా?'' అని భారతశాసనసభలో నొకసభ్యు డడిగెనని ప్రతికలలో ప్రకటింపబడెను అని షౌకతాలిగారు ప్రకటించిరి.

(సమదర్శిని)

## ఇంగ్లండులో పోలీసులును పనిలేనివారును డీకొనుట

లండన్, జూన్ ౧౫:-

నిన్నరాత్రి మూడవసారి డెప్టఫోర్డులో నుహారును తెలపడిరి. కమ్యూనిస్టులు బహిరంగసభలు జరుపుచుండగా జనులు వాద్యమిచ్చి ప్రసంగించిరి. భయమువామెను. పోలీసువారు సోటావర్త్ ముకను ప్రయోగింప ప్రయత్నించిరి. కాని అట్టి కష్టముల గమనవసరము లేకనే అల్లరి శాంతించెను పదమూ

# కోరియా రక్తపాత చరిత్ర

ఈ కాలమున యేదేశమైన సారవంతముగా నుండడ మది పుట్టుకతో చేసుకొనిన పాపము. ఏజాతియైన శాంతి సౌఖ్యాదిగుణములు కలిగియుండి పశుబలమందు వెనుకబడి యున్న దాని మన్నింపరాని తప్పు. ఆ తప్పు మరణముతోనే సమాప్తి కావలయును

కోరియా దేశపు సారవంతమైనభూమి, అమూల్యములైన ఖనిజములు దాని పాలికి మితిలేని కష్టములను తెచ్చిపెట్టెను. ఆ దేశీయుల శాంత క్షమాది సాత్విక గుణములే, ఈ భౌతిక నాగరికత ప్రధాన యుగమునందు దాని పాలిటి మృత్యుదేవత గా పరిణమించెను. అనగా కోరియా దేశపు సుగుణములను సరిదుగా గొని సామ్రాజ్యతృష్ణచే పొగడుచున్న జపాను నామమాత్రము లేకుండ కబళించివైచెను.

ఇదివరకు జపాను అకారణముగా, కోరియనులపైదాడి నిర్దోషులగు స్త్రీ బాల వృద్ధులను నాశన మొనర్చినదియును, పిమ్మట మోసముచేత చీనా సైన్యమును కోరియానుండి వెడల బంపి, „యోంగుహోక్వో" అను రహస్యసంఘమును లేవనెత్తి, కోరియనులకును ఇతర విదేశీయులతో పోరుగల్పించిజపాను తనపదివేలసైనికులను తమవానిని కాపాడుకొను మిషకైన కోరియా కోటల బంపించినదిముచ్చటించి యుంటిమి. జపాను మొదట „యోంగుహోక్వో" అను విప్లవసంఘము నంతమొందించి తన పశుబల ప్రదర్శనముచేత అచటిప్రజలను భయకంపితులయొనర్చి పిమ్మట యచటి రాజును యీ క్రింది షరతులను అంగీకరించునటుల ప్రోద్బల మొనర్చెను.

౧ కోరియా యెన్నటికిని చీనా దేశపు సంరక్షణ క్రిందికి వెడల కూడదు.

౨ ప్రత్యేక వ్యాపారపు హక్కులన్నియును జపాను పరము చేసివేయ వలయును.

౩ క్రొత్త రైల్వే నిర్మాణము, ప్రాతవాని పరిపాలనయును అనగా రైల్వే వ్యవహార మంతయును జపాను వశపరప వలయును.

౪ కోరియా యందలి వెండి బంగారపు గనుల గుత్తాయంతయును జపానుకే యివ్వవలయును.

౫ మూడు దినములలోగా తన సైన్యములు నన్నిటిని కోరియా నుండి వాపసు తీసుకొనునటుల కోరియా చీనాకు యొత్తిడి కలిగించ వలయును,'

చీనాకు జపాను చేయుచున్న ఈ ఆక్రమచర్య మున్ముందు తన పాలిటి కంటకముగా పరిణమించునని తెలియకపోలేదు. అయినను ఆ దినములలో చైనాకు రష్యాయే బలవ జ్వరము సంప్రాప్తించునటు లుండెను, కావున చీనా జపానుతో కోరియా విషయమున పోరుటకు వీలు లేకుండెను. ఇదియే తరుణమని జపాను కోరియానంతయు ఆక్రమించుకొనియెను. జపాను సేనలు సివిలు నగరమును నిదివరకే వశపరచుకొని యుండెనుగదా? పాపము కోరియాకు రాజు జపాను షరతులను అంగీకరించి తనదేశ స్వతంత్రమునకు యెల్లప్పటికిని స్వస్తి చెప్పుటకు గత్యంతరము లేకపోయినది./చూడు చూడుమని ఆకాలమందే ప్రజలందరికిని తమ రాజు చేయు ఆక్రమ కార్యములకు మిగుల విసుగు కలిగియుండెను. కోరియా రాజు తన స్వార్థముకొరకై దేశ స్వాతంత్ర్యమును జపాను పిశాచమున కమ్ముకొనియెను. పిశాచమెప్పటికిని యూరకుండదుగదా! వెంటనే జపాను రాజనీతిజ్ఞులు, నామమాత్రపు శాసన నిర్మాణసభ నొకదానిని నిర్మించి పాతఖానూనుల నన్నిటిని బుట్టలనెట్టి జపాను కనుకూలమగు క్రొత్త ఖానూనులను సృష్టించిరి. మంత్రివర్గమంతయు జపానునుండి రావింపబడెను. పాతమంత్రులు అడవుల పాలైరి, చిన్న చిన్న విషయములందుకూడా రాజుమాట చెల్లుటకు వీలులేదు చ్వెపోలీసు మొదలుకొని గవర్నరు వరకు వుద్యోగులందరు జపానువారిచే నియమింప బడిరి, మంత్రాంగము వారిదే, సరిక దా! ఈ జపాను అధికారులు కోరియనుల పెట్టని తప్పులులేవు. కొన్ని దినములలోనే కోరియనుల జుట్టు కత్తిరించ వలయునని ఆజ్ఞ యయ్యెను. హుక్కా యెంతపొడు గుండవలయునో ఖానూనుచే నియమింప బడెను. బట్టల విషయమై కూడ కఠిన నియమములు జయ్యలుదేరెను. ఇట్లు అమానుష నియమములచేత జపాను ఏమనదేమి? వారిని భయక్రాంతులనుజేసి వారియందు దాగియుండిన స్వాతంత్ర్య భావమును వలిపివేయుటకే? జపానీయులముందు కోరియనులు జపాను దాసులని యనుకొన వలయును

కోరియాను యొకేసారి „ఘటంస్వాహా" యనుటకు జపాను తీవ్రప్రయత్నము చేసెను అయినను దేశమందలి ప్రజాభిప్రాయమునకై దిగులొందెను ఎంత బలమున్నను యొకేసారి రాజునుపిలించుటకు గుండె చాలలేదు ఇంగ్లీషువారు ద్వితీయ షా అలము తరువాత నామ మాత్రమునకు యిరు వుర చక్రవర్తులను యుంచినటులనే వీరుకూడా అచటిరాజును నిలిపియుంచిరి కాని తన మేడలోనే బంధింపబడెను. అతని దేశమున యేమి జరుగుచున్నదో అతనికి తెలియదు స్వదేశస్థులెవరును అతనిని చూడగూడదు. కాని ఫర్మానాలన్నియును కోరియారాజు పేరిటనే వెలుబడుచుండెను. రాజు తనప్రజలకు చేసిన ద్రోహఫలితము జీవితమునందే గుడువ వలసినవాడయ్యెను. నిర్బంధము తెక్కువయి నపుడు రాజు చేయునది లేక నా మేడయందైనను తిరుగుటకు అనుజ్ఞయిండని జపాను అధికారులను వేడుకొనియెను, అందుకు వారు కోరియాప్రహరపు హక్కులన్నియును జపానువశము చేయవలయుననికోరిరి. రాజు దానికిగూడ యొప్పుకొనియెను. రాజు మేడలోపలి భాగమందలి పహరామాత్రము తొలగింపబడెను. వెలుపలి భాగమందు జపాను పిచ్చుకత్తులు మెరయుచునే యుండెను.

ఈ సమయమందు రాజు నిరుపమానమైన పిరికిని గనపరచెను. రాజెంత ద్రోహియైనను దేశమునకై ప్రజలకు రాజుపై ప్రేమ యడుగంటలేదు. కాని అంతఃపురకాంతలతో కులకులాడుచుండిన రాజునకు యింత మాత్రము గ్రహించు బుద్ధిపటిమ యెక్కడిది? కాని స్వాతంత్ర్యేచ్ఛ యెన్నటికిని జంపబడదు. ఏమూల నుండియైన దాని ప్రభ వెలికివచ్చుచునే యుండెను, కోరియా మాత్రమీ సత్యమునకు దూరమగునా? కోరియా దేశపు ప్రజలు మిగుల అసహాయస్థితియందున్నపుడు కోరియారాజు ఇంద్రియ లోలత్వమున మునింగి యున్నపుడు స్వాతంత్ర్యాగ్ని రాణిగారి హృదయమున రగుల్కొనియెను. జపాను దొంగ యెత్తులన్నియును ఆమె గ్రహించెను. రాజునకు ధైర్య మిప్పించుట ప్రయత్నించెను. ఫలము లేకపోయెను. పుట్టుదాసునకు పౌరుష మెక్కడిది? తుదకు రాణి, కోరియా దేశపు అదృష్టము అడవి జపానువారి చేతులలో నున్నదాయని విలపించెనట. అప్పటినుండి రాజు, తనభార్య ఆలోచనగొని రాజకీయ పత్రములపై సంతకములుచేయ మొదలిడెను. జపాను ప్రతినిధి లాయి కౌంటుగారు రాణిగారిని మిగుల గౌరవించుచుండిరి. ఈమె మిగుల స్వగౌరవము కలది. రాణిగారి అస్తిత్వము జపానువారికి కంటక ప్రాయముగా దోచెను. మొదలామెపై ధనాశను చూపిరి. పిమ్మట ప్రాణభయమును కలిగించిరి. అయినను యామహావ్యక్తి తన దృఢ దమునుండి యిసుమంతయును జరుగలేదు. ఎటులనైనను కోరియాకు విముక్తి కలిగింప బద్ధ కంకణురాలయ్యెను. సమయము మించకమునుపే ఈ మహా సాహసధైర్య ధురంధరును, అఖండ దేశభక్తును, రహస్యముగా హద మట్టింప వలయునని వెంచబడెను జపానునుండి హంతకుల సమూహము రావింపబడెను. హంతకులు పైరా వారిని జంపి రాజభవనమునందు జొరబడిరి. దాస దాసీ జనములందరు రాణిగారిని చూపుటకై బాధింపబడిరి ఎటులనో రాణిగారిని కనుగొని ఆమెపై ఆయుధవర్షము గురిపించిరి ఊపిరి లుండగనే పెరటితోటకు గొంపోబడెను. కిరసనాయిలు పోసి క్షణకాలమునసే అపవిత్రమూర్తిని భస్మీభూతముగావించిరి. రాజ్యతృష్ణ నేది చేయించదు?

రాణిగారి ఈ ఘోరహత్య కోరియనుల హృదయములందు చిత్ర విచిత్రపు అపోహలు కలిగించెను అపరాధులను యెటుచూచినను క్షేమము కనుపడలేదు. కావున క్రొత్త పన్నుగడపన్ని రాజును నిర్బంధించి యీక్రింది ప్రకటనపైన సంతకము గైకొనిరి.

„మారాణి మిగుల దుష్ప్రవర్తనరాలు. ఆమెను చంపబడిన పుకారా నట్టి యబద్ధము. ఎచటికో, తగులుకొని వెళ్లి యుండును. మాకు ఆమెదుష్ప్రవర్తన గూర్చి చక్కగా తెలియును. కొన్ని అసాధారణ కారణముల వలన మాకు ఆమె దుష్ప్రవర్తనను అపుటకుగాని లేక ఆమెను శిక్షించుట వీలు కలిగినదికాదు. ఆమె దుష్ప్రవర్తన జాతికి మిగుల అగౌరవకరము. మా జీవితమునకు అపాయకరము. ఈ ఆడది దేశరాజ్ఞీత్వమునకు అర్హురాలుకాదు. కావున మేమీమెను మాసతీత్వమునుండి తొలగించుచున్నాము. ఇటు పిమ్మట దీనిస్థితి దేశమందలి యొక వ్యభిచారిణికన్న యెక్కువ నుండదు"

ఈ ప్రకటనపై సంతకము చేసి, ఆ దుఃఖముచే రాజు కొన్ని దినముల వరకు అన్నమైన తినలేదట. పాపము చేయునదేమి? జపానువారికత్తి మొదలెప్పుడు అతని రొమ్ముపై నాడుచునే యుండెను.

జపానువారీ హత్య విషయ మితర దేశములకు బొత్తిగా తెలియకుండ కట్టుదిట్టములు చేసిరి. కాని సత్యముదాగునా? పాపము బయల్పడక మానునా? యూరపు అమెరికాల యందు ఈవిషయమై సంచలనము జరిగెను. అచ్చటి ప్రజాభిప్రాయమునకు జపానువారు భయపడి కొందరి హంతకులను రాణిగారి హత్యనేరము క్రిందట అరెస్టుచేసి వ్యాజ్యము నడిపిరికాని వారందరు విడువబడిరి జపానుప్రజలందరు ఆ విడుదలైన హంతకులకు బ్రహ్మరథము పట్టిరి వారుగొప్ప దేశభక్తులుగా పూజింపబడిరి రాణిగారి మరణముపై సంతోషోత్సవములు జరిగెను కోరియా ప్రజలుయిదియంతయుచూచుచు దుఃఖము, పట్టలేకపోయిరి. ప్రభుత్వమువారు గొప్ప విప్లవము జరుగ నున్నదని కంపించిరి. జపాను వెంటనే శాంతి స్థాపించుటకుగాను కౌంటు అనే అనుగొప్ప రాజనీతిజ్ఞుని పంపిరి. అయనే రాగానే రాణి నిర్దోషియని ఫర్మాను జారి చేసి, స్మరణ చిహ్నముగా యొక మందిరము నిర్మించి ఆమె జీవితచరిత్ర వ్రాయుటకుగాను ఒక ప్రఖ్యాత పండితులను నియమించెను, సామ్రాజ్యవాదుల మాయలు లెక్కింప నలవిగానుగదా?

ఆకాలమున కోరియాలోవున్న రూసు ప్రతినిధి మిగుల దయావంతుడు. రాజుగారి హీనస్థితి సహించజాలక అతనిని విముక్తి కలుగచేయుటకు ప్రయత్నించెను. ఒకరోజు అంతఃపుర కాంతలు పాలకీలో, యువ రాజుతో గూడ రాజును బయటికి తీసుకొనివచ్చుటకు యింట స్థలమిచ్చిరి. లోకులకే సంగతి తెలియగనే గుప్తకట్టెలుఇటికె పెట్టిల్లు చేసు లబూని రాజుపక్షమున చేరిరి. జపాను ప్రభుత్వ మొక సారి సంక్షోభించిపోయెను. రాజు, కోరియా సైన్యమునకు శత్రువుల రక్తమేదన వెంటనే కావించుటకు ఫర్మాన యిచ్చెను. ముగ్గురు ప్రాతమంత్రులు బజారులలో ఈడ్చి చంపబడిరి.

జపాను రష్యానుచూచి తలక్రిందు లాయెను. ౧౮౯౬ సంవత్సరము కోరియా, జపాను. రష్యాల మధ్య ఒడంబడిక జరిగెను. దాని ప్రకారము జపాను. కోరియాను, అవసరమైనప్పుడు విడిచిపోవుటకు వాయిదా చేసెను.

రెండు సంవత్సరముల పిమ్మట రష్యా జపాను క్రొత్త యొడంబడిక ప్రకారము ఆయిరు దేశములుకూడా, కోరియా సంపూర్ణ స్వాతంత్ర్యమును అంగీకరించెను. ఇంతవరకు జపాను కోరియాను కబళించ వలయునని చేసిన ప్రయత్నములన్నియును నిష్ఫలము లయ్యెను. జపాను విడువలేక విడవలేక కోరియాను విడువవలసి వచ్చెను, వ్యాఘ్రము తన పాతషికారి విడిచిపెట్టి యుండదు కదా? కొంత కాలము పిమ్మట జపాను యెక్కువ పరాక్రమమును గడించెను. ౧౯౦౪ నందు జపాను రష్యాను యోడించుట సుప్రసిద్ధము కదా! వెంటనే జపాను కోరియాను హరించి శాశ్వతముగా తన రాష్ట్రమున కలుపుకొనియెను.

---

# జ్యోతిష్యము

జ్యోతిష్‌శాస్త్ర పండిట్, మెడలిస్టు
పి. వెంకటరంగంగుప్త విద్వత్ భేరి
రామచంద్రపుర అగ్రహారం; గుంటూరు
(మద్రాసు ప్రసిడెన్సీ, M. & S. M. Ry.)

1. సమస్తమయిన సరుకులకు 12 సంవత్సరములకు ముందువచ్చు ధరలను యిప్పుడే తెలుపువారు బొంబాయి బ్రోచి కాటన్, లండన్ యెక్స్చేంజి, రంపులుచేప్పు వెండి, బంగారు, వేరుశనగపప్పు ఆముదాలు, పసుపు, కందులు, ప్రత్తి మూవులు, పెసలు, గడ్డిమూవులు, నెయ్యి, ధాన్యము, బియ్యము, మిర్చి, నూలుబేళ్ళు, రంగుపీసులు, రంగుపెట్టెలు, వగయిరా సమస్తమైన సరుకులకు 12 సంవత్సరములకు ముందు వచ్చు ధరలను యిప్పుడే తెలుపబడును.

2. మరియు 12 మాసములలోపల యేయే తేదీలయందు యేయే గ్రామములలో వర్షము కురియునది యిప్పుడే తెలుపబడును.

3. మెట్టభూములు, మాగాణిభూములు, యిండ్లు మేడలు, యీతేదినుంచి అరవై సంవత్సరములలోగా యెప్పుడు గిరాకియగునది. యిప్పుడే తెలుపబడును.

4. జాతకములు వ్రాయబడును. జాతకములు తనికీచూడబడును. మావద్ద అరవై సంవత్సరముల పాత పంచాంగములు హాజరుగా యున్నవి.

5. వ్యాపార లాభమును పొందదలచిన వారును మీ జాతక విషయమై మీ నష్టకష్టమును నివారణ చేసుకోదలంచినవారును, నాల్గు అణాబిళ్ళలు మా అడ్రసుకుపంపి మీ గ్రామం, పోష్టు, తాలూకా, జిల్లా, రయిల్వే, విపుల్యగా వ్రాయించినవారికి మా కంపెనీలో తయారుచేయు వ్యాపార విషయములకు జాతక విషయములకు పేపర్లు పంపబడును. నైజాం వారు అంగ్రీజు చీట్లు పంపవలయును

6 వ్యాపారమునందు హెచ్చు ధనమును సంపాదించదలంచినవారు మాతో స్వయముగా కలసి మాట్లాడవలయును

ప్రస్తుతం హెచ్చు రాకియగుచు వస్తువులు కొన్ని యున్నవి.

# రైతుల వృద్ధి

మన దేశంలో రైతు దరిద్రుడు, రైతు ఋణగ్రస్తుడై, అప్పిచ్చిన సాహుకారునకు, భూస్వామియగు జమీందారునకు బానిసయై, చదువులేక రోగియై, అర్ధప్రాణమాత్రావశేషముగు పశువులతో, కూలుచున్న కొంపల్లో, సాగుచేస్తూన్న భూమి పండించుకొంటూ, జీవచ్ఛవంగా జీవితాన్ని గడుపుతూ ఉన్నారు. రైతుది బానిసత్వభావమైపోతూంది అతనిలో జీవకళ నశిస్తోంది. అతడు జీవంలేని మెషీనులాగ పనిచేస్తూ తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొంటూ ఉన్నాడు. తనకు కూలిగిట్టకపోయినా, తన పిల్లలకు కడుపునిండా తిండిలేక పోయినా, తనభార్య చింపిగుడ్డలు ధరించుకొంటూ ఉన్నా, తన్ను జమీందారొకవైపునా అప్పులవాడొకవైపునా దాస్యశృంఖలాల బంధించినా మారుమాటాడక, తన నిస్సహాయతనైనా తలచుకోకుండా ఎడతెరిపి లేకుండా పనిచేస్తూన్న కాలచక్రంలోపడి నలుగుతూన్నాడు.

ఋణభారాన్ని తగ్గించడానికి ఏర్పడ్డ సహకార సంఘాలు స్వార్థం లేకుండా పనిచేసే ప్రముఖులు దొరకకపోవడంచే ఆ రైతుఋణాన్ని మరింత వృద్ధిచేసేయి. నికల్సన్‌గారు దక్షిణ హిందూదేశపు రైతుపై రిపోర్టు వ్రాస్తూ రైతును బాగుపరచడానికి రైఫైసన్ ఒకడు కావాలి అని చివరకు తేల్చాడు. అనేక ప్రముఖులు రైతులకొరకు పక్కల నెలకొల్పి ప్రబోధం చేయబూనారు. చదువులేని రైతు వాటివల్ల ఎక్కువలాభం పొందలేకపోయాడు. చదువున్న వాళ్లకు శ్రద్ధలేకపోయింది శ్రద్ధా చదువూ రెండూవున్న వాళ్లకు డబ్బులేకపోయింది.

మనరయితు ఆలసుడు. అలసుడగుటకు పెక్కుకారణములు, విద్యావిహీనత, జీవితమునందు నిరుత్సాహం, దారిద్ర్యం, నిరాశ, అతనిలో ఘనీభవించింది అతని హృదయం గడ్డకట్టింది. అతని మనసు పరుగు నిలిచిపోయింది. విద్యాసక్తుడు. నిరాశాపూరితుడగు మనరైతును మేల్కొల్పడానికి, అతనిలో ఆశను పూరించడానికి యువకులు కావాలి. వారు తమ అందుబాటులో ఉన్న గ్రామాలకు జట్లు జట్లుగా వెళ్లాలి. రైతులకు ప్రబోధం కలిగించాలి. రైతు మేలుకోకపోతే దేశంనుండి దారిద్ర్యం ఎప్పటికీపోదు. పొట్టకూటికై బాధపడుతూన్న ౨౭ కోట్ల ప్రజలలో మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన లాభంతో మనదేశం ... నాగరికతవైపు పరుగెత్తుతుంది యువకులాగమనాన్ని మరలించాలి. గత రెండు శతాబ్దాలలోను పాశ్చాత్య దేశాల్లో కర్షకుడే నాగరికతను ఉజ్జీవింపజేశాడు.

## ఒక విధానము

ఆంధ్రదేశంలో రైతును బాగుపరచాలంటే ఒకమార్గముంది. ప్రతి పట్టణంలోను యువకులు, సంఘాలుగా ఏర్పడి తమ పట్టణాలకు ౧౦-౨౦ మైళ్ల చుట్టుకొలతలో నున్న గ్రామములన్నిటికిని జట్లు జట్లుగా వెళ్లాలి జట్టుకు ముగ్గురు నలుగురుకన్న ఎక్కువ ఉండకూడదు. ఒక్కొక్క జట్టుకు బాగుగా మాట్లాడగల ఒక యువకుడు నాయకుడుగా ఉండాలి. ఆట్లు ప్రతి గ్రామమునకు వెళ్లి ముందు అక్కడి ఆర్థిక సాంఘిక పరిస్థితులను పరిశీలించాలి. తరువాత రైతులకు అనుకూలమైనవేళ సందర్శించి ఒక కోట జేర్చాలి సంఘీభావంలోని శక్తి బోధపరచాలి. ఇతర దేశాల్లో రైతు సంఘీభావంవల్ల తన జీవితంలో ఎట్టి పరిణామాన్ని తెచ్చుకొన్నాడో ఉదాహరించి చెప్పాలి. గ్రామంలో నున్న సహకార సంఘాలు, వాటివలన రైతుకు ఉద్దేశింపబడిన లాభాలు, దాని నభివృద్ధిచేసుకొనే మార్గాలు వారికి బోధించాలి. సంఘాలులేని చోట సంఘములను స్థాపింపజేయాలి. ప్రతి గ్రామంలోను రైతులు సంఘములుగా ఏర్పడి పరస్పర సహకారంవల్ల గ్రామ ఆర్థికస్థితిని బాగుపరచుకొన బూనుటలో ఉన్న సౌలభ్యము వారికి బోధపరచి, అట్టి సంఘములను ఏర్పరచుకొనుటకు వారిని ప్రోత్సహించాలి, జర్మని, ఫ్రాన్సు, డెన్మార్కు, ఇటలీ, జపాను మున్నగు దేశాలలో రైతు రెండు మూడు ఏండ్లక్రితం ఎంత దరిద్రుడుగా ఉండేవాడో అతని భాగ్యమునకు కారణమేమిటో ఏ ఏ విధానముల ననుసరించి అక్కడి రైతు బాగుపడ్డాడో బోధించి చెప్పాలి.

కరణాలు గ్రామాధికారులు సాధారణంగా చదువుకొన్నవాళ్లు గ్రామంలో కరణం కుటుంబం ఒకటే ఉంటుంది ఆ కుటుంబం ... బ్రాహ్మణ కుటుంబం కూడా ... నాటక పటుడు ... తెచ్చి ... ... వారికి ప్రామకు ... గ్రామపునర్నిర్మాణ దృక్పథంలో ఉద్యమించి

... కారాల ... మొకటి ... శ్రీయుత ... గారు ప్రయత్నం చేస్తూ ఉన్నారు. శ్రీ ... గారు ... మహేంద్ర ... లో ... ... గ్రామపునర్నిర్మాణ విధాన లో తర్ఫీదు ... వారు గ్రామపునర్నిర్మాణమును

కూడ ఇట్టిసంఘములు తమ విధిగా తలచి కార్యక్రమమును సాగిస్తే దేశానికి అమూల్యమైన సేవచేసినవాళ్లవుతారు. ఇట్టి కరణాల సంఘములను ఆంధ్రదేశంలో అన్ని తాలూకాల్లోను నెలకొల్పి గ్రామపునర్నిర్మాణోద్యమం సాగిస్తే సులభంగాను క్షేమంగాను కూడా అవుతూంది. పైన వివరించిన యువజన సంఘాలు వారికి తోడుగా పనిచేయాలి కరణాలలోనే, యువకులలోను దేశసేవాపరతంత్రులు కొందరు బయలుదేరి ఇలాంటి సంఘాలు బయలుదేరదీయాలి. రాజకీయంలో వాళ్లెన్న వారికి దూరఫలం ఈ ఉద్యమంలో పనిచేస్తే ప్రత్యక్షఫలం లభిస్తుంది. పునాదిపుచ్చితే ఇల్లుకూలినట్లు దేశ సౌభాగ్యానికి పునాదియైన రైతు దరిద్రుడుగా ఉంటే దేశానికెప్పుడూ విమోచనం కలుగదని మన యువకులు గ్రహించి తక్షణం కార్యరంగంలో ఉండాలి.

దారిద్ర్యభారాన్ని ఒక భుజంపైనను, దాస్యభారం మరొక భుజంమీదను వహించి, అర్ధప్రాణ మాత్రావశిష్టుడై కుంటుచూ నడచుచున్న రైతును చూచిన మీహృదయములు కరగుటలేదా? యువకులారా! రెండు కూలుచున్న భారతజాతి నుద్ధరింపుడు. రైతుసమస్య ౨౭ కోట్ల భారతీయుల సమస్య. ఈ ౨౭ కోట్లసోదరులను వినాశమార్గము నుండి తప్పింపుడు. గ్రామపునర్నిర్మాణమునకు పూనుకొను

---

# హాఫిజు అలి బహదూరు ఖాన్‌గారి అరెస్టు

## పోలీసు కమీషనరు ఉత్తరువులు ఉల్లంఘించినందులకు అరెస్టుచేయుట

బొంబాయి, జూన్ ౧౪ —

హాఫిజ్ అలి బహదూరుఖాన్‌గారు జూలై నెల 3 వ తేదివరకు బొంబాయి నగరము లోనికి రాగూడదని పోలీసు కమిషనరు ఉత్తరవు జేసిరి. ఇతడు జయిలునుండి విడుదలకాగానే యిది అందజేయబడెను

ఇతడు బొంబాయి అహార్ పోర్టుకి అధ్యక్షుడు ఇతడు యీ ఉత్తరవు నుల్లంఘించి నందులకు పోలీసు నేడు సాయంకాలము చౌపట్టిలో వారు అరెస్టుజేసిరి. ఇతని మీద ఎమర్జెన్సీ పవర్సు ఆర్డినెన్సు ౨౧ సెక్షనుక్రింద నేరమారోపింప బడెను. ఇతడు మొదటినుండియును కాంగ్రెసు పక్షమువారు ప్రసిద్ధిగాంచిన ఉపన్యాసకర్త. ప్రథమమున ౧౯౩౦ సం॥లో ఉప్పుసత్యాగ్రహము సందర్భమున నితడు ౧ నెల శిక్ష ననుభవించెను. అపిడు విడుదలయైన కొలదిరోజులకే రాజద్రోహకరమైన వ్యాసము వ్రాసినందులకు ౨ సంవత్సరముల ఖైదుశిక్ష వేయబడెను ౧౯౩౧ సంవత్సరం నవంబరులో నితనిని విడుదలచేసిరి ౧౯౩౨ జనవరిలో ౪వ తారీఖున మూడవ పర్యాయము ఎమర్జన్సి పవర్సు ఆర్డినెన్సు క్రింద అరెస్టుచేసిరి గాని తర్వాత వదిలి విడుదలచేసిరి

---

# శ్రీనాగేశ్వరరావుపంతులుగారి విజ్ఞాపన

## సత్యమూర్తిగారి వింతకృత్యము

## ‘‘మహాత్మునితో ప్రభుత్వమువారు సమాధానపడవలెను’’

(10వ తేదీ) ఉదయమున నన్ను వేలూరు చెరసాలనుండి విడుదలచేసిరి. ఆచెరసాలలో నిపుడు దాదాపు (ఏ) క్లాసు నిర్బంధితులు 40 మందియును, (బి) క్లాసువారు 103 మందియును కలదు మొత్తముమీద వీరందరును క్షేమముగానే యున్నారు.

శ్రీయుత ఎస్. సత్యమూర్తిగారిచే గాంధిమహాత్మునకు పంపబడినట్లు పత్రికలలో ప్రకటింపబడిన లేఖనుగూర్చి సత్యమూర్తిగారు వేలూరు చెరసాలలోనున్న ఖైదీలలోని ఆంధ్ర, ద్రవిడ, కేరళ, కర్నాటక, ప్రముఖులలో నెవరితోడను గూడ నాలోచించియుండలేదనియును ఆ లేఖను వారెవ్వరును ఆమోదించి యుండలేదనియును వారందరిపక్షమునను నేను చెప్పగలను. సత్యమూర్తిగా రిటుల చేసినందులకు మేమందరమును చాల ఆశ్చర్యమును చెందచూ అసమ్మతిని వెల్లడించితిమి. సత్యమూర్తిగారు దీనినిగూర్చి రాజగోపాలాచారిగారితో నాలోచించకుండ నిటుల చేసినందులకు సంతాపమునుగూడ వెల్లడించిరి. అందువలన రాజగోపాలాచారిగారు దీనినిగూర్చి యెట్టిచర్యను దీసికొనరయిరి.

గాంధిమహాత్ముడు లండనునుండి యిండియాకు రాగానే రాజప్రతినిధితో మాటలాడ గోరినపుడు దొరతనమువారు నిరాకరించుట పొరబాటనియును, అందువలననే అధికమగు కష్టముతోనుకూడ తీయ వీలులేని అధికనష్టముతోను తీవ్రప్రస్థాన ముపదేశము మునుగవలసివచ్చినదనియును దొరతనమువారు గ్రహించి గాంధిమహాత్మునకు సంతృప్తిని కలిగించినగాని కాంగ్రెసువారితో నెట్టి సమాధానమును సాధ్యముకాగనియే వేలూరు జెయిలులోనున్న నాయకులును, యితర ప్రాంతములలోనున్న నాయకులును భావించుచున్నారనిగూడ నేను చెప్పగలను, భారతదేశమునకు సంబంధించిన అంతరంగ బహిరంగ వ్యవహారములను భారతీయులు నెరవేర్చుటకు దొరతనమువారు స్వాతంత్ర్యముల నియ్యదలచిరనియు, ఇందులకు బ్రిటిషువా రెట్టినిరోధమును కలిగింపరనియు, భారతీయుల లాభములను కాపాడుటకు అవసరమని నిజమగు భారతప్రతినిధులు నిశ్చయించినట్టి తాత్కాలికములగు నేర్పాటులను చేయుటతప్ప రక్షణలనబడు మరెట్టి షరతులను బ్రిటిషువారు విధింపరనియును గాంధిమహాత్మునకు సంతృప్తి కలిగిననే గాని యెట్టి షరతులనుగూర్చియును కాంగ్రెసుపక్షమువా రాలోచింపజాలరు.

ఎటులనైన తాము త్వరగా విడుదలచేయబడవలెనని చెరసాలలోనున్న వారెవ్వరును తొందరపడుటలేదు. నిర్బంధవిధానమువలన కాంగ్రెసు నడచివేయుట యెన్నిటికిని సాధ్యముకాదను విషయమును దొరతనమువారు పూర్తిగా తెలిసికొనగలుగువరకును చెరసాలలో నుండగలుగుదుమనియే వారు భావించుచున్నారు. కేవలము నిర్బంధవిధానమును మాత్రమే అమలుజరుపుచున్నచో అందువల్ల రాజకీయ పరివర్తనమునకు సంబంధించిన అసత్యములన్నియును సహజముగానే కలుగును. ఇట్టి విషమసమయమున శాంతిని నెలకొల్పగోరువారి కందరికిని ప్రపంచముయొక్క ప్రాచీనచరిత్ర సత్యమును వెల్లడిజేయగల గ్రంథమేయగును.

గాంధిమహాత్మునిద్వారా కాంగ్రెసువారితో ఒడంబడిక చేసుకొనుటవలన తప్ప మరిదేనివలనను శాంతికలుగదను విషయమును అన్నిపక్షములవారును యీసరికి తెలుసుకొనియే యుందురని నేనుతలచెదను.

---

